





# శతకాలు

## భక్తి,జ్ఞాన,నీతి

# కోదండరామ శతకము





## సదాశివ సమారంభాం


గురు దక్షిణామూర్తి


గురు వేదవ్యాస మహర్షి


గురు శుక మహర్షి


గురు నారద మహర్షి


గురు వాల్మీకి మహర్షి


గురు శ్రీకృష్ణ

## శంకరాచార్య మధ్యమాం


గురు దత్తాత్రేయ


గురు బాబాజీ


గురు గౌతమ బుద్ధ


గురు ఆదిశంకరాచార్య


గురు రామానుజాచార్యులు


గురు జ్ఞానేశ్వర్


గురు రవిదాస్


గురు కబీర్ దాస్


గురు చైతన్య మహా ప్రభువు


గురు నానక్


గురు రాఘవేంద్ర స్వామి


గురు వీరబ్రహ్మేంద్ర స్వామి


యోగి వేమన

## అస్మదాచార్య పర్యంతాం


గురు త్రైలింగ స్వామి


గురు లాహిరి మహాశయ



గురు రామకృష్ణ పరమహంస, అమ్మ శారదాదేవి


గురు వివేకానంద


గురు సాయి బాబా


గురు అరబిందో


గురు రమణ మహర్షి


గురు యోగానంద


గురు భక్తివేదాంత ప్రభుపాద


గురు మళయాళస్వామి


గురు విద్యాప్రకాశానందగిరి


గురు చంద్రశేఖర పరమాచార్య

## వందే గురుపరంపరాం..




నన్ను "నేను" తెలుసుకోవటానికి

నన్ను "నేను" మార్చుకోవటానికి

"నేను" గా ఉండటానికి

మరియు అత్యుత్తమ జీవన విధానానికి

కావలసిన భక్తి,జ్ఞాన,కర్మ,ధర్మ సమాచారం ఒకేచోట తెలుగులో ఉచితంగా!

సాధారణంగా వేదాంతం తెలుసుకోవాలనే కోరిక వుంటుంది, కాని గ్రంధాలు అందుబాటులో లేవు. ఇంకొకరి దగ్గర గ్రంధాలు వుంటాయి, కాని జిజ్ఞాసువులకి ఎక్కడ ఉన్నవో తెలియదు. అలాగే కొన్ని లైబ్రరీ లో కొన్ని రకాల పుస్తకాలు మాత్రమే లభ్యం అవుతున్నాయి, అంతేగాక విలువైన గ్రంధాలు సరైన సంరక్షణ లేక కనుమరుగైపోతున్నాయి, కనుక మన అందరి కోసం భారత ప్రభుత్వం పురాతన ఆధ్యాత్మిక గ్రంధాలను సంరక్షించే నిమిత్తం ఎంతో శ్రమతో కంప్యూటరీకరణ ద్వారా ఒక చోట చేర్చుతూ ఆన్ లైన్ చేయటం జరిగింది. ఇటువంటి విలువైన జ్ఞాన సంపదను మరింత సులభంగా అందుబాటులోకి తీసుకురావటానికి సాయి రామ్ సేవక బృందం ఉడతా భక్తి గా ఇప్పటివరకి దాదాపు **5000** పుస్తకాలను వివిధ వర్గాలుగా విభజించి PDF(eBOOK) రూపంలో ఆన్ లైన్ లో ఉచితంగా అందించటం జరిగింది. కనుక ప్రతి ఒక్కరు ఈ సదవకాశాన్ని సద్వినియోగం చేసుకోగలరు. ఇందుకు సహాయం అందించిన భారత ప్రభుత్వపు వెబ్ సైట్( డిజిటల్ లైబ్రరీ అఫ్ ఇండియా http://www.new.dli.ernet.in), ఆర్కైవ్ వెబ్ సైట్(https://archive.org), గూగుల్ వెబ్ సైట్(https://www.google.co.in), మైక్రోసాఫ్ట్ వెబ్ సైట్(http://www.microsoft.com) కు మేము ఋణపడివున్నాము.అలాగే ఇటువంటి బృహత్తర కార్యక్రమానికి పెద్ద మొత్తం లో గ్రంధాలను అందించిన తిరుమల తిరుపతి దేవస్థానమునకు కూడా మనం ఋణపడివున్నాము. సాయి రామ్ సేవక బృందం కోరుకొనేది ఒక్కటే, ప్రతి ఇల్లు ఆధ్యాత్మిక జ్ఞాన గ్రంధాలతో నిండిపోవాలన్నదే మా కోరిక.

ఈ గ్రంధాలను ఉచితంగా ఆన్ లైన్ లో చదువుటకు, దిగుమతి(డౌన్లోడ్) చేసుకొనుటకు గల మార్గాలు:

1) భారత ప్రభుత్వపు వెబ్ సైట్: http://www.new.dli.ernet.in లేక http://www.dli.ernet.in
2) సాయి రామ్ వెబ్ సైట్: http://www.sairealattitudemanagement.org
3) సాయి రామ్ గూగుల్ సైట్: https://sites.google.com/site/sairealattitudemanagement
4) ఆర్కైవ్ వెబ్ సైట్: https://archive.org/details/SaiRealAttitudeManagement

ఈ జ్ఞాన యజ్ఞం పై గల సలహాలు,సూచనలకు సేవక బృందాన్ని సంప్రదించుటకు: sairealattitudemgt@gmail.com

సాయి రామ్ భక్తి,జ్ఞాన సమాచారం: https://www.facebook.com/SaiRealAttitudeManagement

సాయి రామ్ భక్తి,జ్ఞాన సంబంద వీడియోలు: https://www.youtube.com/user/sairealattitudemgt

ఈ జ్ఞాన యజ్ఞంలో ప్రతి ఒక్కరు పాల్గొని, ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకొని,మీరు సంతృప్తులైతే మరొక సాధకునికి, జిజ్ఞాసువులకు మార్గం చూపించగలరని ఆశిస్తున్నాము. మీరు చదువుకోవటంలో ఏమైనా ఇబ్బంది కలిగితే సేవక బృందంను సంప్రదించగలరు. ఒకవేళ మా సేవలో ఏమైన పొరపాటు వస్తే మన్నించగలరు.

ఈ గ్రంధపు భారత ప్రభుత్వ డిజిటల్ లైబ్రరీ గుర్తింపు సంఖ్య: 2020050014949

గమనిక: భక్తి,జ్ఞాన ప్రచారార్ధం **ఉచితంగా eBook** రూపంలో భారత ప్రభుత్వపు సహాయంతో ఇవ్వడం జరిగింది. ఈ గ్రంధముపై వ్యాపార,ముద్రణ హక్కులు రచయిత,పబ్లిషర్స్ కి గలవు, కనుక వారిని సంప్రదించగలరని మనవి చేసుకొంటున్నాము.

**S**ai**R**eal**A**ttitude**M**anagement(SAI RAM) - సాయి నిజ వ్యక్తిత్వ నిర్వహణ(సాయి రామ్)

* సర్వం శ్రీ సాయినాథ పాద సమర్పణమస్తు *

# అతి విశిష్టం ఈ దానం!

స్వామి వివేకానంద

"దానాలలోకెల్లా ఆధ్యాత్మిక విద్యాదానం చాలా శ్రేష్ఠమైంది! దాని తరువాతిది లౌకిక జ్ఞానదానం, ప్రాణదానం, అన్నదానం" అని వ్యాసమహర్షి చెప్పారు.

మన ఆధ్యాత్మిక జ్ఞానం భారతదేశ హద్దులలో నిలిచి పోకూడదు. లోకమంతటినీ ఆవరించాలి! ఇలా లోకవ్యాప్తమైన ధర్మప్రచారాన్ని మన పూర్వులు చేశారు. హైందవ వేదాంతం ఎన్నడూ ఈ దేశం దాటి పోలేదని చెప్పేవారూ, మతప్రచారార్థం తొలిసారిగా, పరదేశాలకు వెళ్ళిన సన్న్యాసిని నేనే అని చెప్పేవారూ, తమ జాతిచరిత్ర నెరుగని వారే! ఇలాంటి సంఘటనలు ఎన్నోసార్లు జరిగాయి. అవసరమైనప్పుడల్లా, భారతీయ ఆధ్యాత్మిక జ్ఞానప్రవాహం వెల్లువలా లోకాన్ని ముంచెత్తుతూ వచ్చింది.



రాజకీయ ప్రచారాన్ని రణగొణధ్వనులతో, యోధులతో సాగించవచ్చు. అగ్నిని కురిపించి, కత్తిని ఝళిపించి, లౌకిక జ్ఞానాన్నీ, సంఘనిర్మాణ విజ్ఞానాన్నీ విరివిగా ప్రచారం చేయవచ్చు. కానీ ఆధ్యాత్మిక జ్ఞానదానం కళ్ళకు కనిపించకుండా, చెవులకు వినిపించకుండా కురుస్తూ, రోజా పువ్వుల రాసుల్ని వికసింపజేసే మంచులాగా నిశ్శబ్దంగా జరగవలసి ఉంది. భారతదేశం నిరాడంబరంగా, లోకానికి మళ్ళీ మళ్ళీ చేస్తూ వచ్చిన దానమిదే!

మిత్రులారా! నేను అవలంబించే విధానాన్ని తెలియజేస్తాను వినండి. భారతదేశంలోనూ, ఇతర దేశాల్లోనూ మన పారమార్థిక ధర్మాలను బోధించడానికి తగినవారుగా మన యువకుల్ని తయారు చేయడానికై భారతదేశంలో కొన్ని సంస్థలను నెలకొల్పాలి! ఇప్పుడు మనకు కావలసింది బలిష్ఠులు, జవసంపన్నులు, ఋజువర్తనులు, ఆత్మ విశ్వాసపరులు అయిన యువకులు. అలాంటి వారు నూరుమంది దొరికినా, ప్రపంచం పూర్తిగా పరివర్తన చెందగలుగుతుంది!!

ఇచ్ఛాశక్తి తక్కిన శక్తులన్నిటి కన్నా బలవత్తరమైంది. అది సాక్షాత్తూ భగవంతుని దగ్గరి నుండి వచ్చేదే కాబట్టి దాని ముందు తక్కినదంతా లొంగిపోవలసిందే. నిర్మలం, బలిష్ఠం అయిన 'ఇచ్ఛ' (సంకల్పం) సర్వశక్తిమంతమైంది. దానిలో మీకు విశ్వాసం లేదా? ఉంటే మీ మతంలోని మహోన్నత ధర్మాలను ప్రపంచానికి బోధించడానికై కంకణం కట్టుకోండి. ప్రపంచం ఆ ధర్మాల కోసమై ఎదురుచూస్తోంది. అనేక శతాబ్దాలుగా ప్రజలకు క్షుద్రసిద్ధాంతాలు నేర్పడం జరిగింది. వారు వ్యర్థులని ప్రపంచమంతటా బోధలు జరిగాయి. ఎన్నో శతాబ్దాల నుండి వారు ఈ బోధనల వల్ల భయభ్రాంతులై, పశుప్రాయులైపోతున్నారు. తాము ఆత్మస్వరూపులమనే మాటను వినడానికైనా వారెన్నడూ నోచుకోలేదు. "నీచాతినీచుడిలో కూడా ఆత్మ ఉంది. అది అమృతం, పరమ పవిత్రం, సర్వశక్తిమంతం, సర్వవ్యాపకమైనది" అని వారికి ఆత్మను గురించి చెప్పండి. వారికి ఆత్మవిశ్వాసాన్ని ప్రసాదించండి. ❖

మూలం: శ్రీ రామకృష్ణ ప్రభ - ఫిబ్రవరి 2014



ఓం.

శ్రీరామ.

# కోదండరామ శతకము.



సీ. శ్రీధర శ్రీవత్స శ్రీరామ శ్రీకృష్ణ
సరసీరుహాంబక శరణు శరణు
గోవింద గోపాల గోవర్ధనోద్ధార
సర్వజ్ఞ రాఘేశ శరణు శరణు
రఘువీర దనుజారి రాజీవలోచన
జగదేకనాయక శరణు శరణు
కనకాంబరాచ్యుత కారుణ్యసాగర
శాశ్వతామలరూప శరణు శరణు

గీ. శంఖచక్రగదాధర శరణు శరణు
సకలజగదీశ మధురిపూ శరణు శరణు
శార్ఙ్గపాణి సనాతన శరణుశరణు
రామశ్రీరామ కోదండరామచంద్ర.

సీ. పురుషోత్తమానన్య పరిపూర్ణ సత్కామ
పరమాత్మ సుర రక్ష శరణు శరణు
ధరణీశ కంసారి ధరణీధరముకుంద
సర్వద శ్రీహరి శరణు శరణు
పద్మాపతి రామ పరదేవ శ్రీకృష్ణ
సురవంద్యవారాహ శరణు శరణు
క్షీరసాగరవాస శేషతల్పశయన
చాణూరమర్దన శరణు శరణు

గీ. సాధుమానసనిలయాయ శరణు శరణు
పరమపావన నిలయాయ శరణు శరణు
దురితవల్లిలవిత్రాయ శరణు శరణు
రామ శ్రీరామ కోదండ రామచంద్ర. 2

సీ. నిత్య కల్యాణాయ నీరజనయనాయ
శశ్వదచ్ఛపవిత్రాయ శరణు శరణు
మోహనాకారాయ ముక్తి ప్రదాతాయ
శాంతస్వరూపాయ శరణు శరణు
భవనుతనామాయ భవహరనామాయ
సచ్చిదానందాయ శరణు శరణు
వేదస్వరూపాయ వేదాంతవేద్యాయ
సర్వాంతరస్థాయ శరణు శరణు

గీ. సామగాన విలోలాయ శరణు శరణు
పరమధర్మ ప్రతిష్ఠాయ శరణు శరణు
జానకీ భృంగ చిత్తాయ శరణు శరణు
రామ శ్రీరామ కోదండ రామచంద్ర.

సీ. శ్రీరామచంద్ర నీ సేవజేయుదమన్న
కర్మేంద్రియంబులు గట్టుబడవు
జానకీరామ నీ స్మరణ సేయుదమన్న
జ్ఞానేంద్రియంబులు శాంతినిడవు
పట్టాభిరామ నీ భజన సేయుదమన్న
విషయంబులేమొకో వీడిపోవు
పురుషోత్తమా నీదు పూజసేయుదమన్న
వాసనాత్రయములు వదలిపోవు

గీ. సులభమగు సూత్రమెవియేని గలదె! తండ్రి
లోని శత్రులకందక జ్ఞానమెఱిగి
నీ పదచ్ఛాయఁ జేరంగ నీరజాక్ష
రామ శ్రీరామ కోదండ రామచంద్ర.

సీ. నీనామభజనంబు నేదలంపఁగమనం
బుయ్యాల జంపాల లూపుచుండు
శ్రావకచరితంబు దలచెడిచో చిత్త
ముయ్యాల జంపాల లూపుచుండు

నీగుణకీర్తనం బేగణింపగనెద
యుయ్యాల జంపాల లూపుచుండు
త్వత్సుందరాకృతిం దలచెదుచో డెంద
ముయ్యాల జంపాల లూపుచుండు

గీ. ఏమి నాపాపమోగాని రామచంద్ర
ఎవ్వరో లోన నొకగుండి యిట్లు నన్ను
చెఱుచుచున్నట్లు దోచె రక్షింపరావె
రామ శ్రీరామ కోదండ రామచంద్ర. 5

సీ. మనసార పాదుకల్ మౌళిదాల్చెదనన్న
భరతుండు పట్టిన పట్టువిడడు
వింజామరంబును వీచెదననుకొన్న
సౌమిత్రి క్షణము విశ్రాంతినియడు
భక్తిచే ఛత్రంబు బట్టెదమనుకొన్న
శత్రుఘ్నుడణువంత పందునియడు
చరణాబ్జముల సేవ సల్పెదమనుకొన్న
మారుతి దగ్గర జేరనియడు

గీ. ఎట్లు నాతండ్రి నిన్ను సేవింతు నేను
జన్మసార్థకంబును జేసి సంతతంబు
నీదు సాయుజ్యభాగ్య సంపాదినగుదు
రామ శ్రీరామ కోదండ రామచంద్ర. 6

సీ. కన్నుమిన్గానక కామాతురుండనై
కాలంబులో కొంత గడపినాడ
హద్దుపద్దులేక హరిభక్తిహీనత
కాలంబులో కొంత గడపినాడ
మంచిచెడ్డనకను వంచక గుణుడనై
కాలంబులో కొంత గడపినాడ
జాతినీతియులేని సంఘానుసారినై
కాలంబులో కొంత గడపినాడ

గీ. ఇంతకాలంబువరకు నే నిట్లుగడపి
ఇపుడు తద్దోషపరిహార మెంచి నిన్ను
ఆశ్రయించితి మాం రక్షయనుచు నమ్మి
రామ శ్రీరామ కోదండ రామచంద్ర. 7

సీ. ఒకమాటు నీనామ ముచ్చరించెడువారి
కాపూట కలుషాగ్ని యారిపోవు
ఒకపూట నీనామ ముచ్చరించెడువారి
కానాటి దోషాగ్ని యారిపోవు
ఒకనెల నీనామ ముచ్చరించెడువారి
కాయేటి పాపాగ్ని యారిపోవు
ఒకయేడు నీనామ ముచ్చరించెడువారి
కాజన్మ దుఃఖాగ్ని యారిపోవు

గీ. ననెడి యాప్తవాక్యంబు నే నాశ్రయించి
నిశ్చయాత్ముండనై మది నిన్ను నమ్మి
సంతతము వేడుచుంటి నీసాక్షిగాను ॥ రామ॥ 8

సీ॥ పసివాని మాటల పాటింపరాదన్న
పసివాడుగాదె భూపతిసుతుండు
పాండిత్యరహితుని భావింపతగదన్న
పండితుండగునె వేదండవిభుడు
నిరుపేద బల్కులు నిక్కంబుగావన్న
శ్రీమంతుడగునె కుచేలుడిలను
రూపహీనునిబల్కు రూఢిగాదనియన్న
కోమలాంగియె జూడ కుబ్జ యిలను

గీ. ఏమి యాధిక్యమునుగాంచి యింపుమీర
వారి కీప్సితంబులనిచ్చి చేరదీసి
బ్రోచియుంటివో నన్నట్లె బ్రోవుమయ్య ॥ రామ॥ 9

సీ. ఏమొ పోనిమ్మని యిందిర నుడివెనా
నను బ్రోవకుంటివి నలిననాభ
దరిజేర్చవలదని తమ్ములు నుడివిరా
దయ జూపకుంటివి దనుజహరణ
పాలింప తగదని పావని నుడివెనా
యార్తి దీర్పంగరావబ్జనేత్ర

అధికారి కాడంచు యనుచరులాడిరా
యాదరింపగ రావు వేదవినుత

గీ. ఎవ్వరైనను సౌర్వక సేవకాని
చాడి మాటల నాపైన నాడినారొ
కానిచో బ్రోవరావేమి కమలనాభ ॥రామ॥ 10

సీ. భక్తాళి విన్నపంబాలించు పనిచేత
నామొర వినరాదొ రామచంద్ర
దీనుల కష్టముల్ దీర్చుచుండుటచేత
నామొర వినరాదొ రామచంద్ర
మునిజన గోష్ఠిలో మునిగి యుండుటచేత
నామొర వినరాదొ రామచంద్ర
బంధుమిత్రుల బ్రోచు పనికల్గి యుంటచే
నామొర వినరాదొ రామచంద్ర

గీ. సర్వభూతాంత రాత్మవై సాక్షీతి
అన్నిగని వినునీకు నావిన్నపంబు
చెవుల బడలేదొ నన్ను రక్షింపవేల ॥రామ॥ 11

సీ. కరుణింతువని నీదుచరణద్వయము నమ్మి
బ్రతిమాలుచుంటినో రామచంద్ర
దయజూపుదని నీదు దాస్యంబుగోరి నే
ప్రార్థించుచుంటినో రామచంద్ర

రక్షింతువంచు త్వదక్షయ చరితంబు
పరిస్తుతించుచునుంటి రామచంద్ర
దరిజేర్తువని నీదు శరణార్థినై మది
ప్రేమించి యుంటినో రామచంద్ర

గీ. నిన్ను మెన్నెన్నొ విధముల సన్నుతించి
దీనతన్ వేడుచుండంగ దేవదేవ
యార్తిదీర్పవదేమి నన్నరయవేమి ॥రామ॥ 12

సీ. కూర్మి జూపెడుదాక కోదండరామయ్య
నీనామ భజనంబు నేనువిడువ
దరిజేర్చునందాక దశరథరామయ్య
నీగుణ కీర్తన నేను మాఱువ
దర్శనం బిడుదాక తారకరామయ్య
నీమూర్తి ధ్యానంబు నేనువిడువ
చెంత జేర్చెదుదాక శ్రీరఘురామయ్య
నీదివ్య చరితంబు నేనుమరువ

గీ. ఎట్లు నను జేతువో భారమెల్ల నీదె
తప్పదిక నన్నుబ్రోవ నాయప్ప నీకు
నమ్మె సీతమ్మసాక్షిగా నాదు మనవి ॥రామ॥ 13

సీ. నీల నీరద దేహ నిను జూచి మెప్పుడు నా
మలిన నేత్రములు నిర్మలినముగునో

కల్యాణరామ నీకథ విని యెప్పుడు నా
మలినమౌ చెవులు నిర్మలిన మగునో
జానకీరామ నిన్ స్మరియించి యెపుడు నా
మలినమౌ నాల్క నిర్మలిన మగునో
పట్టాభిరామ నీ పదమంటి యెపుడు నా
మలినమౌ జన్మ నిర్మలిన మగునో

గీ. అయ్య కృపతోడ దెల్పి నాయార్తి దీర్చి
బ్రోవరా వేమి నాతండ్రి భానుతేజ
తగినవాడను గానో నీదయకు నేను ।రామ॥ 14

సీ. నీదాస్య భాగ్యంబు నిచ్చెడు నందాక
నేనిట్లె భజియింతు నీదు పేరు
నీ ముఖాబ్జంబును నేజూచు నందాక
నేనిట్లె వర్ణింతు నీగుణములు
నీ కృపామృతసిద్ధి నిచ్చెదు నందాక
నేనిట్లె వినుతింతు నీదు కథల
నీ యాశ్రయ సుఖంబు నిచ్చెడు నందాక
నేనిట్లె పూజింతు నీదు మూర్తి

గీ. నీవు యేనాటికైన గానిమ్ము నన్ను
కరుణతో బ్రోచునందాక కష్టమైన
సౌఖ్యమైనను విడువనీ సాక్షి గాను ॥రామ॥ 15

సీ. శ్రీరామచంద్ర నీ సేవజేయుటకన్న
యితర సదుద్యోగ మేదినాకు
భద్రాద్రి రామ నీ భజన సేయుటకన్న
యితర కర్మంబిక యేది నాకు
పట్టాభి రామ నీ భక్త మైత్రికత కన్న
యితర ధర్మంబిక యేదినాకు
జానకీ రామ నీ చరితామృతముకన్న
యితర కథాలాప మేదినాకు
గీ. పొట్టకును బట్టకును నేను బొగడనొరుల
నెన్నిజన్మల కైనను గన్నతండ్రి
అన్నిటికి నీవె దిక్కు యీ యర్భకునకు ॥రామ॥ 16
సీ. పిలచిన పలికెడి ప్రియులు లేనందుచే
నిన్ను ప్రార్థించి తంచెన్నబోకు
ఆలు బిడ్డల బ్రోవ పీలు లేనందుచే
నిన్ను కోరితినంచు నెన్నబోకు
కుడువ గట్టగ కూడుకడ్డ లేనందుచే
నిన్ను వేడితి నంచు నెన్నబోకు
వార్ధక దశనాకు వచ్చియున్నందుచే
నిన్ను నమ్మితినంచు నెన్నబోకు
గీ. అన్ని గల్గెనుగాని యేమున్న నేమి
నాకు తావక సత్కృప లేకయున్న

నంది లేనట్లి గాదెనాకున్న వెల్ల ॥రామ॥ 17

సీ. పదునాల్గు జగములు భరియించు నీకునే
భారమైపోతినో పద్మనాభ
ఆర్తుల రక్షింప నవతరించిన నీకు
దూర మైపోతినో దురితహరణ
ధర్మ సంస్థాపన దక్షుండవగు నీకు
భారమైపోతినో పరమపురుష
కామితార్థ ప్రదకల్పకమగు నీకు
దూరమైపోతినో తోయజాక్ష

గీ. సిద్ధ జనదత్త భువనప్రసిద్ధమైన
బిరుదు లేమయ్యెనో భక్తవరద నేడు
నన్ను పాలింప రావేమి కన్నతండ్రి ॥రామ॥ 18

సీ. తలఁప నీ తల్లి దండ్రులపయి నీవు జూ
పించిన యటువంటి వినయగరిమ
చెలఁగి గురుడగు వసిష్ఠునిపై నీవు
బఱపించి నటువంటి భక్తిసొంపు
జగదేక నాయకుండగు మహేశ్వరునిపై
నుచితమౌ భక్తి నీ కుండినగుణ
నీ ప్రియ బాంధవ నిచయంబు పైన నీ
వలరింపగా జాలినట్టి ప్రేమ

గీ. తలచి చూడగ నీ నాల్గు తగినరీతి
లోకనాయక నీ యందు నాకుగలవు
కలవా లేవోయను కొనకొక్క పరిరమ్ము రామ॥ 19

సీ. ఐహిక వ్యాపార మనుభవించిన మీద
నీపైని దృష్టిని నిల్పుదనక
ఇంద్రియ వ్యాపార మిగిరిపోయినమీద
నీపైని చిత్తంబు నిల్పుదనక
సిరిసంపదలు వెల్ల జీర్ణమైనంతనే
నీపైని కోర్కెలనిల్పుదనక
చుట్ట పక్కాలు నన్ తిట్టి రోసినమీద
నీపైని లక్ష్యంబు నిల్పుదనక

గీ. అన్ని యనుభవింపగనున్న యదనునందు
భ్రాంతులన్నింటి విడచి నీప్రాపుగోరి
నిన్నె కాలత్రయంబునే నెన్నుచుంటి రామ॥ 20

సీ. ఎవ్వరైన కొనుటకిత్తురేమోయన్న
విక్రయింపగజాలు వేద్యులెవరు
ఎవరైన నరువుకు నిత్తురేమోయన్న
యరువునకిడజాలు యాప్తులెవరు
ఎవరైన తాకట్టు కిడెదరేమో యన్న
తాకట్టుకిడజాలు ధన్యులెవరు

ఎవ్వరైన బదులు నక్కిత్తురేమో యన్న
బదులీయ జాలిన సదయు లెవరు

గీ. భక్తిసామ్రాజ్య భాగ్యసంప్రాప్తికొరకు
యెన్ని జూచిన లాభ మేమున్న దయ్య
నీదు కృపలేక యున్న చో నెట్లు గలుగు ॥రామ॥ 2

సీ. మతధర్మముల జూచి మన్నింతువనుకొన్న
మారుతి జన్మంపు మత మదెద్ది
యాచారమును జూచి యాదరింతువటన్న
వ్యాధుని యాచార భావ మెద్ది
కులధర్మమును జూచి కూర్మి జూపెదవన్న
గుహునికి సరియైన కుల మదెద్ది
లింగభేదము జూచి ఔంగదీర్చెదవన్న
యెంగిలిచ్చిన యామె లింగ మెద్ది

గీ. మతము నాచార కులలింగ గతుల నెంచి
మున్ను రక్షించినావె రామన్న వారి
భక్తి నారసిగాదె చేపట్టినావు ॥రామ॥ 22

సీ. ఇపుడేమి యవసరం బపుడు చూచెదనన్న
అప్పటి గతియేమొ యరయగలని
ఇంతలోనె నేల యెప్పటికో యన్న
యెప్పుడెట్లగునో నే నెరుగ గలనె

ఈ యీడులో నేల నాయీడు పనికన్న
నీయీడు నమ్మకంబేమినాకు
ఈనాడు నాకేల ఆనాటిపనికన్న
యీనాడునావ్రతియెట్లులగునో

గీ. యన్నభీతిచే నేడనిన్నాశ్రయించి
పాహిమాం పాహిమాం పాహి పాహియనుచు
వినయముగ వేడునన్నింక వీడబోకు ॥రామ॥ 23

సీ. ఈనాటికారుణ్య మానాడు నాపైని
గల్గునోగల్గదో కమలనాథ
ఈనాటి యాదరంబానాడు నాపైని
నిల్చునో నిల్వదో నీలదేహ
ఈనాటికూరిమి యానాడు నాపైని
వచ్చునో రాదెమొ వనరుహాక్ష
ఈనాటి వాత్సల్య మానాడు నాపైని
యుండునో మఱియుండదో రమేశ

గీ. గానవేడెద మహాత్మునన్ గరుణతోడ
బ్రోవుమాతంక్రి నీకొప్ప పూజసేతు
వనజనేత్ర దయాంభోధి పరమపురుష ॥రామ॥ 24

సీ. ఏపూట కూలినా కాపూటనీయక
నీయొద్దదాచుము నీరజాక్ష

ఏనాటి బత్తెంబు నానాడె కొలువక
　　　　నీయింటనుంచుము నిగమ వినుత
ఏనెలజీతంబు నానెలయొసగక
　　　　నీయొద్ద నిల్పుము నీలదేహ
ఏయేటిఫలమును నాయేడొయియ్యక
　　　　నీయొద్ద దాచుము నిర్మలాత్మ

గీ. దాచుకొనియుంచపెట్టుము తావులేదు
భారమొకొ నీకుసుతుని దర్విణ్యంబుదాచ
వలసినపుడిమ్ము కరుణించి వడ్డితోడ ॥రామ॥　　　　25

సీ. పలుగనాయున్నచేఁ బరిభవమంది నీ
　　　　శరణు కోరగలేదు జానకీశ
అన్నచాపల్యాన తన్నినంతభయాన
　　　　శరణు కోరగలేదు జానకీశ
జనకుండొనర్చు హింసలకు బెగ్గిలినీదు
　　　　శరణు కోరగలేదు సారసాక్ష
అల తురుష్కుని బాధ లనుభవింపగలేక
　　　　శరణు కోరగలేదు పరమ పురుష

గీ. కలుగలేదట్టి యిక్కట్లు గానినేను
అవని నీకృపాధనము నార్జింపకున్న
భారమగు పృథ్విఁకని నిన్ను కోరుచుంటి ॥రామ॥　　　　26

సీ. అప్పునప్పులు జేసి పప్పుకూడు దిని
తద్దోష శాంతికై దలపలేదు
పరుల ద్రవ్యము దెచ్చి పరమాన్నముల్ మెక్కి
తద్దోష శాంతికై దలపలేదు
కూటసాక్ష్యము బల్కి చేటుపాటెఱుగక
తద్దోష శాంతికై దలపలేదు
మాయమాటలు చెప్పి మంత్రముల్ బోధించి
తద్దోష శాంతికై దలపలేదు
గీ. దేహవిషయాదివాసనల్ దీర్చుకొనక
జన్మకారణ బీజము సమయుకొనక
కాలిగోరంత నీసేవ గోరియుంటి ॥రామ॥ 27

సీ. యజ్ఞార్థమై దక్షిణ మడిగినంత నెయిచ్చు
ధనదాతలుండిరి ధన్యులగుచు
ధర్మకార్యార్థమై తమప్రాణ మొసగెడు
ప్రాణదాతలు గలరు ప్రముఖులగుచు
గోత్రాభివృద్ధికై కూతుల నొసగు క
న్యాదాతలెందరో యవనిగలరు
అన్నార్థమై పెక్కు నగ్రహారములిచ్చు
భూదాతలుండిరి పుణ్యులగుచు
గీ. యెవ్వరేమిచ్చినను లాభమేమిగలదు
ముక్తినిడు కర్తలిందేరి భక్తరక్ష

అరయ నీదక్క నొరులకు శక్యంబె శంకరి ॥రామ॥ 28

సీ. నిన్నెంచునప్పుడైన నన్నొప్పరావ్వరో
పనిగల్గినట్టువచ్చి పలుకరించు
నినుగొల్చువేళలో నేమేమొ సంగతుల్
పిలువకయేవచ్చి తెలివిజెరచు
నిను భజించెదువేళ వెనుకటి పాపముల్
చలులకైవచ్చి కలతబెట్టు
నిను స్మరించెడువేళ నియమవర్జితులైన
నీచులు యరుదెంచి నిష్ఠజెరుతు

గీ. రేమి ప్రారబ్ధకర్మమో యినకులేశ
ఎన్నివిధములనైన సాధింతుమన్న
అలవిగాకుండె నన్ను నీవరయకున్న ॥రామ॥ 29

సీ. బ్రీతిమాలి గుణమును పట్టినిల్పుదమన్న
శునకంబుగతి దిశల్ జూచుచుండె
ఎరవేసి వృత్తుల నింత కట్టుదమన్న
సారంగ ద్భృగ్రీతి సంచరించు
భయపెట్టిభావంబు పట్టికట్టుదమన్న
భ్రమరంబువలె భ్రమవడుచునుండు
బోధించి మనసును సాధింతమనుకొన్న
గజకర్ణమట్టుల కదలుచుండు

గీ. నింక నేయుపాయంబుచే నిందిర్యములె

విషయ వాసనోన్మాదంబు విడిచి వైచి
నిశ్చయుండనై శాంతిగా నిన్నుదలతు ।రామ। 3

సీ. బాల్యంబునుంచి నాపాట్లన్ని దిలకించి
ఎన్నెన్నొ యాటలాడించినావు
యౌవనంబున నాదు యాచారములజూచి
యేమేమొ పనుల జేయించినావు
కౌమారమున నన్ను కరుణచే గనిపెట్టి
యెన్నెన్నొ యూళ్ళు దిప్పించినావు
సంధికాలమునందు సద్గోష్ఠి గల్గించి
యెన్నెన్నొ భ్రమల పోనిచ్చినావు
గీ. యింక రానున్న కాలాన యెట్లు నన్ను
కాచి రక్షించెదో తండ్రి కరుణతోడ
కర్త్రిపై సాముగా దోచె కమలనాభ ।రామ। 3

సీ. జాతిమర్యాదకై శాస్త్రవాదము సేయు
శబ్దపండితుమైత్రి వలువనీకు
మతగౌరవార్థమై మత్సరంబును గ్రుక్కు
మూర్ఖవాదులలోన మునుగనీకు
ఆచారఘనతకై నార్యుల దూషించు
నసురాళి చెలిమి వాకొనగబోకు
భావప్రతిష్ఠకై వాక్సంగరము సేయు
నుద్రేకుమైత్రి వా కొనగబోకు

గీ. జాతిమతభావ యాచారసంఘు తెరిగి
నిన్ను మదినిల్పి సేవించు నియమయుతుల
పొత్తు నాకిచ్చి కరుణతో బ్రోవుమయ్య ॥రామ॥

సీ. ఒకనాడు రోగంబు నొకయేడు భోగంబు
లనుభవించెడివారి నరయుచుంటి
ఒకనాడు భోగంబు నొకయేడు రోగంబు
లనుభవించెడివారి నరయుచుంటి
ఒకనాడు నైశ్వర్య మొకయేడు దారిద్ర్య
మనుభవించెడివారి నరయుచుంటి
ఒకనాడు సౌఖ్యంబు నొకయేడు దుఃఖంబు
లనుభవించెడువారి నరయుచుంటి

గీ. ఇందు స్థిరముగా జరిగెడు దెద్దిలేదు
స్థిరముగానట్టివాటికై మురిసిపడక
నిత్య సౌఖ్యార్థినై మది నిన్నుగొలుతు ॥రామ॥ 3

సీ. ననుజూచి నవ్వును నాగరికులటన్న
దురభిమానంబును ద్రోసివైచి
పరిహాసమొనరింతురు భాగ్యవంతులటన్న
భాగ్యాభిమానంబు పారవైచి
వేరు సేతురు నన్ను విద్యాధికులటన్న
విద్యాభిమానంబు విడచివైచి

వెలిబెట్టుదురు నన్ను కులబంధువులటన్న
 స్వకులాభిమానంబు జారవైచి

గీ. అస్మదభిమానమూర్తి వీవంచు నమ్మి
చుట్టపక్కాలు రామదాసులని నమ్మి
ఆశ్రయించితి త్వత్పదాబ్జాతయుగళి ॥రామ॥ 35

సీ. చేరదీసినతోడ మీరి పోదునటంచు
 శోధించుచుంటివో సుందరాంగ
తరిగాదు యింకనీ దాసదాసున కంచు
 వేచియున్నాడవో వేదవేద్య
తగువాడు గాడింక దర్శనం బిడనంచు
 శంకించుచుంటివో జానకీశ
చేజిక్కినంతనే చెలరేగి తిరుగునం
 చోగి దలంచితివో సోమాక్షమేశ

- అట్లగాకున్న నీవు నన్నాదరింప
రాని కారణమేమయ్య రామచంద్ర
బాగుసేయుము నాకింక శరణమిమ్ము ॥రామ॥ 36

సీ. చూతము లెమ్మంచు శోధింప దలచిన
 నెట్లు సాధింతు నే నీషణముల
గానిమ్ము లెమ్మంచు కాలింబ గదిపిన
 నెట్లు జయింతు నే నింద్రియముల

పోనిమ్ము లెమ్మంచు పోజాడ నొంచిన
నెట్టుల తృష్ణసహింపగలను
త్వరయేమి లెమ్మంచు తామసించితివేని
యెట్లు భరింతువో హెచ్ఛనిలను

గీ. బాల్యమున నుండి నాదగు బ్రతుకు నరిగి
పరిస్థితముగల్గు నాయార్తి బాగ నరిగి
కాలమూరక యీరీతి గనుప దగునె ॥రామ॥ 37.

సీ. కరుణించినంతనే గర్వింతునను కొన్న
గర్వించి నేనేమి ఘనుడ నగుదు
శరణిడినంతనే పరుగిడుదు మటన్న
పర్విడి నేనేమి బాపుకొందు
మనవాలకించిన మరచిపోదువటన్న
మరచి నీనింకేమి మెరుగగలను
దర్శనం బిడినంత తప్పిపోదువటన్న
తప్పిన వేరేమి దారిదొరుకు

గీ. అట్టు గర్వించి మరచి మోహాంధుడనయి
తప్పి తిరిగిన పిదునే దండధరుడు
యెందుబోయిన నీవు లేకున్న దెచట ॥రామ॥

సీ. పరధనాకర్షణ ప్రజ్ఞాబలైశ్వర్య
మదలబ్ధ దుర్మద మణపవయ్య

సీ. వేదు ప్రతిష్ఠల గోరి నేనీసేవ
సేయుచుండగ లేదు శ్రీరమేశ
ఐహిక సౌఖ్యంబు లాసించి నిన్ను నే
నాశ్రయింపగ లేను యార్య వినుత
భాగ్య భోగంబుల బడయంగ నిన్ను నే
ప్రార్థింపగా లేదు పరమపురుష
ఆయురారోగ్యంబు లభివృద్ధికై నిన్ను
యాచించియుండ లేద మరవినుత
గీ. గాని యాచించు చుంటి త్రికాలములను
భక్తిమాత్రము మరువని పథమునొకటి
తద్వారంబిడి నను బ్రోవు దాసపోష రామ॥ 41

సీ. శాస్త్రవాసనకొంత సంపాదనము సేయ
చాలదు యికనున్న కాలమనుచు
అద్వైత గంధంబు నార్జింపవలెనన్న
చాలదు యీజన్మ కాలమంచు
వేదపురాణముల్ వెదకి తర్కింపంగ
చాలదు మామక శక్తియనుచు
సాంఖ్య యోగైశ్వర్య సంసిద్ధినొందగ
చాలదు నాకున్న జ్ఞానమనుచు
గీ. వేద వేదాంగముల కెల్ల విశ్వమునకు
నీదు నామాక్షరంబులె నిక్కమైన

తారకంబని నే నిన్నుఁ దలఁచుచుంటి రామ। 42

సీ. నీమాయఁ దెలియంగ నేరక మోహులై
పార్వతీనాథుండు పరుగులిడడె
నీమాయ నరయంగ నేరకనవాంబుచే
జలజజుఁ డిందుఁ ద్రిందు శరణమనరె
నీమాయఁ దాటంగ నేరక కాములై
మునులెల్ల మోహాబ్ధి మునిగిపోరె
నీమాయ బాయంగ నేరక వెఱ్ఱులై
రెంతెంతవారలో గంతులిడరె

గీ. ఇంకనాయట్టి కించిజ్ఞుఁ డెట్లు సహజ
మానవ వికార మూలమౌ మాయనెఱుఁగు ?
నీవు కృపఁజూపి తప్పుమన్నించకున్న రామ। 43

సీ. అవనీశుడైనను నమరేశుడైనను
నీకటాక్షము చేత నేలవలయు
లోకంబులైనను లోకేశులైనను
నీదయాదృష్టిచే నిలువ వలయు
భూతంబులైనను భూతేశులైనను
నీయాజ్ఞచేతనే నిలువ వలయు
యోగీంద్రులైనను భోగీంద్రులైనను
నీకృపా బలముచే నిలువవలయు

గీ. అంతటి ఘనులె నీశరణార్థులగుచు
గడపుచుండంగ తమ తమ కాలమెల్ల
మానవుడనగు నే నిన్నమనవగలనె. రామ॥ 44

సీ. శరణన్న మాత్రాన శరణిచ్చి బ్రోతట
శరణీయమంటి నీచరణమంటి
దయగోరు మాత్రాన దయజూపి బ్రోతట
దయజూపమంటి నీ దాసునంటి
మొరబెట్టు మాత్రాన మొరవిని బ్రోతట
మొరవినుమంటి నీ కరుణయంటి
కనుమన్న మాత్రాన కనబడి బ్రోతట
కనుబడమంటి నీ తనయునంటి

గీ. అంటి యనుచుంటి నికముందు ననగనుంటి
దురభిమానంబు విడచి నాశిరమువంచి
దోసిలొగ్గితినంటి నీ తోషయంటి రామ॥ 45

సీ. ఇందెవ్వరినినమ్మి నేమి సార్థకమయ్యె
వ్యర్థ ధనార్జన వాంఛగాక
ఇందెవ్వరిని నమ్మి నేమి పుణ్యంబయ్యె
రౌరవలోక కారణముగాక
ఇందెవ్వరిని నమ్మి నేమి లాభంబయ్యె
కామరాగాది రోగంబుగాక

వింతేవ్వారివినమ్ము నేమి సౌఖ్యంబయ్యు
కర్తవ్య భార దుఃఖంబుగాక

గీ. నమ్మదగినట్టి పూజ్యుల నమ్మకిలను
నమ్మరానియపూజ్యుల నమ్మి తుదకు
అనుభవించెదు నాదేద్వనగునె సుఖము ॥రామ॥ 46

సీ. భక్తిరసామృతపానంబు జేసినా
డెందమందానంద మొందుటెపుడో
దాసబృందముగూడి తన్మయతనుజెంది
డెందమందానంద మొందుటెపుడో
జన్మసాఫల్య ప్రసాద సంసిద్ధిచే
డెందమందానంద మొందుటెపొ
తావక దివ్య సందర్శనప్రాప్తిమై
డెందమందానంద మొందుటెప్డొ

గీ. ఎప్పుడింకెప్పుడెప్పుడో ఇనకులేశ
కాలము గళించుచుండె నాగతిని నరసి
నన్ను రక్షింపగారమ్ము గన్నతండ్రి ॥రామ॥ 47

సీ. గడియగడియకు నీకథవినిపొంగెడు
వాడెపో సద్భక్త వరుడునీకు
మాటమాటకు నీదు మహిమలెంచి సుఖించు
వాడెపో సద్భక్త వరుడు నీకు

జీవితాంతము నిన్ను సేవించి తృప్తుడై
వాడె పోనద్భక్త వరుడు నీకు
దినదినంబును నీదు ఘనమెంచి యాడెడు
వాడెపోనద్భక్త వరుడు నీకు

గీ. పరమనంతోషి సద్భక్త వరుడు నీకు
దురితదూరుండు సద్భక్తవరుడు నీకు
సరసచరితుండు సద్భక్త వరుడు నీకు ॥రామ॥ 48

సీ. పురుషులై పుట్టిన పుణ్యంబుకై నీదు
చరణాబ్జముల సేవ సలుపవలయు
మగువలై పుట్టిన మర్యాదకై నీదు
సత్కథాశ్రవణంబు సలుపవలయు
పండితులైనట్టి ప్రఖ్యాతికై నీదు
సద్గుణకీర్తన సలుపవలయు
ధనవంతులైనట్టి ఘనతకునై నీదు
సంబంధకర్మల సలుపవలయు

గీ. పుట్టినందుకు పుణ్యంబు బుగ్గి గలిపి
ఖ్యాతిఘనముల రెంటిని గోతవెట్టి
బొర్రి పెంచుక తిరిగిన పుణ్యమేమి ॥రామ॥ 49

సీ. జీవితాంతమువందు స్థిరచిత్తుడై నిన్ను
భావించుచుందునో భక్తుడతడు

సమతచే నెవ్వండు శాంతాత్ముఁడై నిన్ను
ధ్యానించుచుండునో దాసుడతఁడు
ఆశలేకెవ్వండు అమలాత్ముఁడై నిన్ను
స్మరియించుచుండునో సాధుడతఁడు
భయములేకెవ్వండు భద్రాత్ముఁడై నిన్ను
జపియించుచుండునో జ్ఞానియతఁడు

గీ. సర్వజనపూజితుడతండు సరసుడతఁడు
అతఁడు నిత్యసంతోషి మహాత్ముఁడతఁడు
అట్టివాఁడె జీవన్ముక్తుఁడవనియందు ॥రామ॥ 50

సీ. పరకామినీసంగభావంబు విడలేక
రామరామాయన్న నేమిఫలము
ఐహికవ్యాపార మణచిపెట్టఁగలేక
రామరామాయన్న నేమిఫలము
దుర్విషయములు ద్రోసిపుచ్చఁగలేక
రామరామాయన్న నేమిఫలము
వాదభేదపిశాచి వాకట్టుఁ గట్టక
రామరామాయన్న నేమిఫలము

గీ. సహజముగనున్న దుర్గుణ సమితినెల్ల
విద్యచేబుద్ధిచే ద్రుంచి వేరుగనక
నిన్ను ధ్యానింపవలయు లేకున్న సున్న ॥రామ॥ 51

సీ. సంసారతారక సాధనోపాయంబు
తారకనామ మంత్రింబటంచు
షడ్వర్గబలజయ సాధనోపాయంబు
తారకనామ మంత్రింబటంచు
జన్మసార్థకగుణ సాధనోపాయంబు
తారకనామ మంత్రింబటంచు
సకలవేదాంతార్థ సాధనోపాయంబు
తారకనామ మంత్రింబటంచు
గీ. అనుభవైకవేద్యులమాట లాలకించి
నమ్మి ధ్యానించుచుంటి నిన్ననుదినంబు
తత్ఫలంబిచ్చి నను బ్రోవు దాసరథీ ॥రామ॥ 52

సీ. పరనిందకనినచో పరువిడుచిత్తంబు
హరిపూజకనినచో పరుగులిడదు
దుష్కార్యమునకన్న దుమికెడు చిత్తంబు
సత్కార్యమునకన్న సాగిరాదు
కపటవృత్తులకన్న కాల్ద్రవ్వు చిత్తంబు
ధర్మచింతనకన్న తామసించు
మోహచింతనకన్న ముందేగుచిత్తంబు
మోక్షచింతనకన్న మొండిబడును
గీ. చిత్తజాడ్యంబు మాన్పవా సిద్ధమైన
నౌషధంబును దెల్పి నా యార్తి దీర్చి

చిత్తశాంతిని జేసిరక్షించుమయ్య ॥రామ॥ 53

సీ. కాలంబుగనిపెట్టి గడపెడు ఘనులపై
దుశ్చిత్తచరితులు దుముకుచుంద్రు
దేశధర్మముగాంచి తిరుగు సజ్జనులపై
మోసకులపనింద మోపుచుంద్రు
సమయంబు గనిపెట్టి చరియించు భక్తుపై
దురితులు పాపముల్ దోయుచుంద్రు
స్థితి గతులనెరింగి తిరుగు సూనృతులపై
క్రూరకర్ములు రాల రువ్వుచుంద్రు

గీ. కాల మహిమయో వీరల కర్మగతియొ
యేమి విపరీతమోగాని యుంది కేశ
లోకవమ్యో నీ దాసులీ లోకులకును, రామ॥ 54

సీ. భక్తవత్సలుడన్న ప్రఖ్యాతికై నాడు
శబరి యెంగిలిదిన్న సాక్ష్యమొకటి
కరుణార్ణవుండన్న ఘనతకై యానాడు
శత్రుసోదరుబ్రోచు సాక్ష్యమొకటి
దానప్రియుండన్న ధర్మంబుకై నాడు
సామీరినేలిన సాక్ష్యమొకటి
సాధురక్షకుడన్న సత్కీర్తికై నాడు
సతిని రక్షించిన సాక్ష్యమొకటి

గీ. యిట్టిప్రత్యక్ష సాక్ష్యంబు లెన్నొజూపి

వత్సలతజూపి కరుణింతువనుచునమ్మి
దాస్యమొనరించుచుంటి సీతమ్మసాక్షి ॥రామ॥ 55

సీ. భాగ్యవంతుడగాను బంగారు నగలిచ్చి
నిన్ను తృప్తుని జేయ నీరజాక్ష
పండితుండనుగాను పాండిత్యమును జూపి
నిన్ను శాంతుని జేయనిగమవినుత
బలవంతుడనుగాను బలమును జూపించి
నీదాస్యమును జేయ నీలదేహ
గుణవంతుడనుగాను గుణముల గణుతించి
నీకృపనొందగ నిర్మలాత్మ

గీ. ఎద్దినొసగంగ శక్తిలేకేను నాదు
మనసు దీరంగ నిచ్చితి తనువు మనసు
ప్రాణములనింక నాగతి పతియునీవె ॥రామ॥ 56

సీ. ధనమిచ్చితావర దయబొందెదనన్నచో
శ్రీపతినీకేమి సిరులనిత్తు
భూమిచ్చినీకృప బొందెదనన్నచో
భువనేశనీకేమి భూములిత్తు
పండ్లిచ్చి నీదుకృపన్గాతు నన్నచో
పరమేశనీకేమి పండ్లనిత్తు
కానుకలిచ్చిన న్గనవలెనన్నచో
కంజాక్షనీకేమి కానుకలిత్తు

సతుక్ చెలగిపండ్లు

కాన్క లర్ధయుగపీకాంత కమలనాథ
భక్తిదక్కనీకృపక్కట్టె ఫలములేల? ॥రామ॥ 57

సీ. నామసంకీర్తనానంద సంతుష్టుడై
కామ భూతమునరి కట్టవలయు
తారక నామమున్తానుభావార్థుడై
యాకలిదప్పి ణాపవలయు
సంతత సత్కథాశ్రవణాను సరణుడై
బంధ గుణముల బాపవలయు
సద్భక్త జనబృంద సహవాస సిద్ధుడై
మానాభిమానంబు మాన్పవలయు

గీ. జ్ఞానయుత భక్తి కర్మలనలుప వలయు
నియమనిష్ఠల బాయక నిలుపవలయు
నీదు కారుణ్య సిద్ధికై నీరజాక్ష, రామ॥ 58

సీ. పండితుండైనను పామరుండైనను
యేనాటికైన నిన్నెంచవలయు
ధనవంతుడైనను ధనహీనుడైనను
యేనాటికైన నిన్నెంచవలయు
గుణవంతుడైనను గుణహీనుడైనను
యేనాటికైన నిన్నెంచవలయు

కర్మిష్ఠుడైనను ధర్మిష్ఠుడైనను
    యేనాటికైన నిన్నెంచవలయు
గీ. నిన్ను నెంచక పూజింపకున్న నరులు
    మున్ను జన్మంబు లెత్తిన నేమిఫలము
    భారమగుగాదె పృథ్వికి భక్తపోష. రామ॥ 59

సీ. బలవంతమైనట్టి బాహ్మణార్థము చేత
    భక్తిరహితమైన పత్రి చేత
ఉపదేశమెఱుగని ఉపవాసములు చేత
    తత్త్వమెఱుగని వాదంబు చేత
సద్విచారము లేని సన్యాసమది చేత
    ధర్మశూన్యంబైన ధనము చేత
పరమశాంతము లేని పాండిత్యమది చేత
    భర్తను వేధించు భార్య చేత
గీ. దమ తితీక్షలు లేనట్టి తపము చేత
    మంచి చెడ్డ లెఱుంగని మాట చేత
    భక్తి లేనట్టి మనుజుల బ్రదుకు చేత. రామ॥ 60

సీ. తనలోన నెవ్వాడు తనబీజమును వేచు
    వాడెపో తారక బ్రహ్మవిదుడు
తనలోన నెవ్వడు తన శక్తి తోరపించు
    వాడెపో తారక బ్రహ్మవిదుడు

తనలోన నెవ్వడు తనబిడ్డ ముద్దాడు
వాడెపో తారక బ్రహ్మవిదుడు
తనలోన నెవ్వడు తన గృహంబునుగాల్చు
వాడెపో తారక బ్రహ్మవిదుడు
గీ. నగునటంచు భావించి నిన్నాశ్రయించి
కాచియుంటిని తచ్ఛుద్ధి గాంచుకొరకు
తనయభావంబు నికముందు తం(డ్రిదనుచు ॥రామ॥

సీ. ధనపిశాచము బూని దారిద్ర్యులనుదూరి
తదుపరియగుగతి తలపకుంద్రి
విద్యామదంబెక్కి వేదవేత్తలదూరి
తదుపరియగుగతి తలపకుంద్రి
అధికార గర్వులై అన్యులవేధించి
తదుపరియగుగతి తలపకుంద్రి
దేహమదాంధులై దేహదూషణజేసి
తదుపరియగుగతి దలపకుంద్రి
గీ. క్రమముగా నాలుగణగిన కాలమందు
పూర్వదోషఫలంబులు పొందకుండెరి
పొందునాడైన మతికి రాకుందువేల ॥రామ॥

సీ. జానకిరామయ్య సాకేతరామయ్య
ఆదరింపగరమ్మన్న ఆర్తరక్ష

కల్యాణరామయ్య కౌసల్యారామయ్యా
పాలింపగారమ్మ భక్తపోష
అయోధ్యరామయ్యా ఆనందరామయ్యా
కరుణింపరారమ్మ పరమపురుష
దశరధరామయ్యా తారకరామయ్యా
దరిజేర్చగారమ్మ దానవరద

గీ. ఏమి మోహనరామయ్యా యేల పలుక
వేమి పట్టాభిరామయ్యా యేలరావు
రావురావుగా నాతండ్రి బ్రోవరావె ॥రామ॥ 63

సీ. వందనంబులుసేతు సుందర రామయ్యా
కనులార నీమోము గాంచనిమ్మ
దండంబులర్పింతు దశరధరామయ్యా
చేతులారంగ పూజింపనిమ్మ
నతులనేకముసేతు పతితపావనరామ
నొకమారు పాదమ్ము లొత్తనిమ్మ
మొక్కులు మొక్కెద మోహనరామయ్యా
నిత్యమ్ము నీచెంత నిలువనిమ్మ

గీ. సంతతము జేతు శతనమస్కారములను
బిడ్డతప్పులు మన్నించి ప్రేమతోడ
ఈప్సితార్థములిచ్చి నన్నేలుకొనుము ॥రామ॥ 64

సీ. దాసుని నొకమారు దగ్గరజేర్చిన
గౌరవంబుకుహాని గలుగబోదు
ఆర్తుపై నొకమారు ననుకంపజూపిన
సద్యశోలోపంబు జరుగబోదు
శరణార్థి నొకమారు శ్రమదీర్చి బ్రోచిన
ధర్మరక్షణశక్తి తరుగబోదు
సేవకు నొకమారు చేపట్టినంతనే
యిక్ష్వాకుకులకీర్తి యుగిరిపోదు
గీ. నీదు కరుణయేయున్న నామీద కొంత
తావు ప్రాప్తింపకున్న నీ తనయునకును
దయకు తావిచ్చి రక్షింపు తండ్రి నన్ను ॥రామ॥
సీ. ఏమిభాగ్యంబబ్బ యెన్నాళ్లు గొలిచిన
మోము జూపవునాకు రామచంద్ర
ఏమి బంగారమో యెంత వేడినగాని
సాక్షాత్కరింపవు జానకీశ
ఏమి విలాసమో యెన్ని మ్రొక్కినగాని
మ్రొక్కులందవు జగన్మోహనాంగ
ఏమి రాజసమబ్బ యెంత ప్రార్థించిన
ప్రార్థనల్ వినవిప్డు పరమపురుష
గీ. నీదు శరణంబె దిక్కంచు నెమ్మనమున
విశ్వసించిన నన్ను నీవెట్టులైన

సేయు మదె నాదు సౌఖ్యంబు శ్రీరమేశ ॥రామ॥ 66

సీ. ఏమి కార్పణ్యంబు ఇనకులాన్వయచంద్ర
పసివాడనైన నాపైన నీకు
ఏమి ద్వేషంబయ్య శ్యామసుందర దేహ
పామరుడైన నాపైననీకు
ఏమిమాత్సర్యంబు సురధరార్చిత
జ్ఞానంబు లేని నాపైననీకు
ఏమి శత్రుత్వంబు నిభరాజ రక్షక
పతితుండ నైన నాపైన నీకు

గీ. ఏమికోపము నాదోష మేమితండ్రి
దోషమున్నను శరణార్థి ద్రోయదగునె
శరము వంచిన బిడ్డకు శిక్షతగునె? రామ॥ 67

సీ. మరువక నీ నామ మంత్రంబు జపియింప
నావంతు నీవంతు నన్ను బ్రోవ
విసువక నీకథల్వీనులారగ వింట
నావంతు నీవంతు నన్ను బ్రోవ
విడువక నీకీర్తి పఠ్వసించుచు నుంట
నావంతు నీవంతు నన్ను బ్రోవ
సతతంబునీగుణ సంకీర్తనముసేయ
నావంతు నీవంతు నన్ను బ్రోవ

గీ. యింతియేగాని నాకింక నేమివంతు
ఎన్నివంతులు గల్గిననేమి ఫలము
కాటికేగాని మోక్షంబుగలుగబోదు. రామ! 68

సీ. నావంతు స్మరియింప నీవంతుకరుణింప
తప్పదు మనకింక తప్పదయ్య
నావంతు పూజింప నీవంతు రక్షింప
తప్పదు మనకింక తప్పదయ్య
నావంతు ధ్యానింప నీవంతుమన్నింప
తప్పదు మనకింక తప్పదయ్య
నావంతు నుతియింప నీవంతు పాలింప
తప్పదు మనకింక తప్పదయ్య

గీ. తప్పినను నీకు నాకింక తప్పదయ్య
తెగకందిన వుల్లను తెగెవిడునె
విడినచో నేలపాల్గాదె వేదవేద్య. రామ! 69

సీ. బ్రతికివన్నాళ్ళు నిన్భజియించు వారికే
ప్రాప్తియున్నదో లేదో పరమ పదవి
డుగడుగునకు నిన్నర్చించు వారికే
సంభవించునో లేదో జన్మసిద్ధి
ముక్కాలములయందు మ్రొక్కెడి వారికే
సిద్ధించునో లేదో సిద్ధపదవి

వలుకు పలుకునకు భయపడు వారికే
సంప్రాప్తమో లేదో జ్ఞానసుఖము
గీ. ఎన్నడో తీరినపుడు కూలిచ్చి సీదు
భజనసేయించు శ్రీదాస వరులనైన
ఆర్తులకు ముక్తి కలలోని వార్తగాదె. రామ! 70

సీ. పనికిమాలినదంచు తనువును దూషింప
తనువు లేకెటు నీదుపనులు సేతు
పనికిమాలినదంచు వనితనుదూషింప
వనిత లేకెటు సదువార్తదెలియు
పనికిమాలినదంచు ధనమునుదూషింప
ధనము లేకెటు సేతుధర్మములను
పనికిమాలినదంచు జగమునుదూషింప
జగము లేకెటు నీదు జాడదెలియు
గీ. తనువులోనుండి సత్తపాధవముబడసి
జ్ఞానశక్తి తోదృగ్భోగ సౌఖ్యమంది
వరవశంబును జెంద, నీశరణమంటి. రామ! 71

సీ. కర్మేంద్రియంబుల ధర్మంబునెరుగక
కర్మకు లోబడ్డ కష్టమిడవె
జ్ఞానేంద్రియంబుల సత్యంబునెంచక
మోహదాసుండైన ముంచకున్నె

విషయేంద్రియంబుల విషయంబునెరుగక
విషయలంపటుడైన విషముగాదె
పంచభూతంబులప్రాధాన్య మెరుగక
స్థూలవశ్యుఁడైన సుఖము గలదె
గీ. వాయు పంచక మెరుగక వాసనలకు
దాసుడైనాది సేవన్న వాసిగలదె
వాసిబోయిన జీవచ్ఛవంబుగాదె. రామ॥ 72

సీ. తనువుపైవనితపై తనయులపై నాశ
ముంచుగా దెగ్రించి తామోహిగాక
బంధుమిత్రాది సంబంధమెల్లను దెగ్రించి
దెగ్రించితివను మాటనెంచుకొనక
స్వార్జిత ధనరక్ష సంగతి వర్జించి
వర్జించితనిలోన వాంఛలేక
ఆకలి దప్పుల నాలోచనను వీడి
వీడితిననిలోన భీతిలేక
గీ. ఎట్లు జరుగునో లేదంచు నెంచుకొనక
అంతటను నున్నరాముడే యండయనుచు
స్వాంతమున నమ్మువారికి చింత గలదె। రామ॥ 73

సీ. సంశయజ్ఞానంబు సంసార మునముంచు
అర్థార్థభక్తి మోహంబు బెంచు

అవిదితా చలవాదమవినీతునిం జేయును
పరిపూర్ణ వాదంబు భ్రష్టుఁ జేయు
గురిలేని వాక్యంబు గుంటలో ద్రోయును
నిర్గుణ వాదంబు నీతిఁ జెరుచు
మహిమోక్త యోగంబు మాయలో ముంచును
కామ్యకర్మంబు దుష్కర్మఁ జేయు

గీ. శ్రద్ధలేనట్టి చదువు కష్టంబునిచ్చు
అహముగల్గినసేవ యాయానమిచ్చు
బాహ్యవేషంబు మాయదంభంబు బెంచు ॥రామ॥ 74

సీ. కనుమూసి నప్పుడు గనుపడు చీకటి
కనువాని కెంతలోఁగాన బడెనో
కను దెరచి నపుడు కనుబడు దృశ్యంబు
కనువాని కెంతలోఁగానబడెనో
కనుమూసి మాయక గనునప్పుడదియిది
కనువాని కెంతలోఁగాన బడెనో
కనువాడు కనుదానిగని పల్కునప్పుడు
కనివిని వాడెందు గాంచి వినెనో

గీ. దానిననుభవించిన వాడె ధన్యుడగును
వాడె నిను గన్న తత్త్వవిద్వర్యుడగును
వాడె పుణ్యుండు ముక్తుండు వాడెయగును ॥రామ॥

సీ. గత కష్టసుఖములు స్మృతికి రానీకుము
అల్లదే నాకొంప గుల్లసేయు
ఆగత మెట్లన్న యనుమాన ముంచకు
మల్లదేనా కొంపగుల్లసేయు
ఐశ్వర్య దారిద్ర్యముసు భేదముంచకు
మల్లదేనా గూడుగుల్లజేయు
సాధ్వసాధులటంచు ఛాందసంబుంచకు
మల్లదేనా యొడల్ గుల్లసేయు
గీ. ఏది యెటులైన నెవ్వరు యెట్టులున్న
భక్తవాత్సల్యతనుజూపి పరమపురుష
తుదకు నీలోకమిమ్మా నాకదియెచాలు ॥రామ॥ 76

సీ. చెప్పనేర్చినవారు సేయజాలక యుంద్రు
సేయనేర్చినవారు చెప్పకుంద్రు
ఆడనేర్చినవారు పాడనేర్వకయుంద్రు
పాడనేర్చినవారలాడకుంద్రు
ఎరుకగల్గినవారు మరపులేకుందురు
మరపుగల్గివారు లెరుగకుంద్రు
భయముగల్గినవారు బయలుకురాకుంద్రు
బయలునుండినవారు బ్రతికియుంద్రు
గీ. బ్రతికియుండినవారు సద్గతులగాంత్రు
సద్గతుల నొందమూలమౌ సగుణభక్తి

కన్నసీనామ మంత్రిమా కన్నతండ్రి ।రామ। 77

సీ. తనలోని శబ్దంబు తానాలకించుచు
పరులతో నెట్లు తాపలుకగలడు
తనలోని స్పర్శని తాదిలకించుచు
పరుల నెబ్భంగి తానరయగలడు
తనలోనివాసన తాపట్టనప్పుడు
పరులవాసననెట్లు పట్టగలడు
తనలోని గుణముల తానరయునప్పుడు
పరగుణమ్ముల నెట్టులరయగలడు

గీ. తాను తానుగానుండి తత్పరత లేక
నిర్వికారుడైవటపూర్ణ పద్మనంద
పరులకా సౌఖ్యమెట్లు చెప్పంగగలడు ।రామ। 78

సీ. మాలమాదిగలంచు మఱియు మైలయటంచు
కులకక్షలనుబూని పలుకువారు
గురుశిష్యులమటంచు గురువుమర్మములటంచు
గురుకక్షలనుబూని గూలువారు
శివకేశవులమటంచు సిద్ధాంతులమటంచు
మతకక్షలనుబూని మ్రగ్గువారు
స్నానసంధ్యలటంచు శాస్త్రధర్మమటంచు
కర్మబద్ధాత్ములై గ్రాలువారు

గీ. ఎందరెందరో ఘేమేమొ పొందుపరచి
చెప్పి జీవించువారల చెల్మినాకు
యెన్ని జన్మాలకైనను నియ్యబోకు ॥రామ॥ 79

సీ. కౌపీనధారివై కర్తృత్వము వహించి
పైనల శాసించ పరువుగలదె
ధర్మోపదేష్టవై దంభంబు వహియించి
లంచంబు లాశింప లాభమగునె
సాధువర్తితుండయ్యు క్రోధంబు వహియించి
పరులను బెదరింప భావ్యమగునె
ఆర్తభక్తుఁడయ్యు నభిమానము వహించి
జాతి ధర్మముఁ లెంచ నీతియగునె

గీ. సద్వ్రతాచారియటుల వేషంబు వేసి
శాంతి యశనంబు నాశించు శ్వానమట్లు
జీవితాదర్శధర్మంబు జెఱపదగునె ॥రామ॥ 80

సీ. అదినాది యిదినాది యనుమాట లేకుండ
సర్వంబు నీవంచు సంతసించి
నేను నావారంచు నీల్గు జాడ్యములేక
నీది నీవారంచు మోదమంది
వారు వీరనిపించు వ్యష్టిపైత్యమువీడి
యందరు నీవారటంచు దలచి

తల్లి యత్త యను భేదగుణమును విడచి
అందఱు సీతమ్మలంచు నమ్మి

గీ. ఎద్ది తనదైన తనవార లెవ్వరైన
సర్వమును నీదు మయమంచు శాంతినొంది
తిరుగు పుణ్యాత్ములకు జన్మ తిరిగి కలదె ॥రామ॥ 81

సీ. పోరానిచోట్లకు బోనీక దయతోడ
పోదగుచోట్లకే బోననిమ్ము
రారానివారల రానీక కృపతోడ
రాదగువారల రాగనిమ్ము
కారానికర్మల కానీక కరుణతో
కావచ్చు కర్మల కలుగనిమ్ము
చేరాని పనులను చేనీక దయతోడ
చేదగు పనులను జేయనిమ్ము

గీ. మంచిచెడ్డలనారసి యుంచితముగ
ఎట్లు నామేలుసేయ నీకిష్టమగునొ
అట్లు ననుజేసి రక్షించుమయ్యముందు ॥రామ॥ 8

సీ. కామవర్జితవేళ కలుగు నీపదభక్తి
కామంబు గలనాడు కలుగబోదు
కదలలేనప్పుడు కలుగు నీపదభక్తి
కదలి పెందలనాడు కలుగబోదు

కష్టకాలమునందు కలుగు నీపదభక్తి
సౌఖ్యకాలమునందు జ్ఞప్తిరాదు
కూడులేనప్పుడు కుదురు నీపదభక్తి
కూడు గల్గినవాడు కుదరబోదు

గీ. ఏమి మాహాత్మ్యమొగాని రామచంద్ర
కామబలసౌఖ్యములు కూడు గల్గువాడు
భక్తి కుదురంగ నీయసహైత్యమేమి ॥రామ॥ 83

సీ. భక్తుడా యాతండు భక్తుడేమైనచో
శ్రీపతి మాన్ మాకిప్డు చూపగలదె
యోగియా యాతండు యోగియేమైనచో
సిద్ధిచే నొకటి సృష్టింపగలడె
జ్ఞానియా యాతండు జ్ఞానియే మైనచో
త్రిపుటిరాహిత్యంబు తెలుపగలడె
మౌనియా యాతండు మౌనియేమైనచో
మాయావికారంబు మాన్పగలడె

గీ. యంచు నూరక పరుల దూషించునట్టి
దాంభికులకండ్ల బడనట్టి దారిజూపి
యేమరక నన్ను దయను రక్షింపుమయ్య ॥రామ॥ 84

సీ. మంచిమాటలచేత మానాభిమానంబు
వదలిపోదేమయ్య వారిజాక్ష

ధర్మసూక్తులచేత దాయాదివైరంబు
కాలిపోదేమయ్యా కమలనాథ
ఆప్తవాక్యముచేత నాశాపిశాచంబు
పీడిపోదేమయ్యా వేదవేద్య
సామవాక్యంబుల వ్యామోహముంచక
చల్లారదేమయ్యా సాధుపోష

గీ. విన్నమోపాట్లు బడివదలించుకొనగ
తుదకు స్వార్థరాహిత్యతన్ సదయ హృదయ
బడితి నీపాలయికనాదు పాప్తమయ్యా ॥రామ॥ 85

సీ. క్షణమైన చిత్తవిశ్రాంతి గోరనినాదు
ధనకాంక్షలేటికో దనుజహరణ
క్షణమైన సద్గోష్ఠి నలుపజాలనినాదు
సంసారమేటికో జానకీశ
క్షణమైన సత్కథాశ్రవణ సేయనినాదు
జీవితంబేటికో శ్రీరమేశ

గీ. జీవితమునందు జీవత్వసిద్ధి కొరకు
ఒక్కక్షణమైన నిన్నెంచకున్ననాదు
బ్రతుకు వృథయంచు నీనామ భజనసేతు ॥రామ॥ 86

సీ. భవరోగ శాంతికై బ్రతిమాలుకొలదిని
భవమొసంగెద వేల భక్తరక్ష

భయభ్రాంతమునుదోల భజియించు గొలదిని
భయపెట్టు దేటికో భక్తవరద
బంధవిముక్తికై ప్రార్థించుకొలదిని
బంధించ దేటికో భక్తవినుత
బాధావిముక్తికై ప్రార్థించుకొలదిని
బాధలిచ్చెదవేల భక్తపాల

గీ. నిన్ను సయభయ వినయునై విమ్మనమున
ధ్యానమొనరించుచుండ ప్రత్యక్షముగను
నెరిగినను బ్రోవరానేమి యినకులేశ ॥రామ॥ 87

సీ. నిన్న జేసినపనుల్ నేడుక్రొత్తగదోచి
యాశాపిశాచికినండ నొసగ
నిన్నటిభుక్తముల్ నేడు క్రొత్తగదోచి
జిహ్వావికార ప్రసిద్ధు జేసె
నిన్నటిభోగముల్ నేడుక్రొత్తదోచి
మోహాంధకూపాన ముంచివైచె
నిన్నటిమనుజులే నేడు క్రొత్తగదోచి
బంధుహిత గుణసంబద్ధు జేసె

గీ. అనుభవించిన యెంగిలి యనుభవించ
క్రొత్తయైనట్లు గనుపించి కూల్చుచుండ
క్రొత్తపనిజూపి ననుబ్రోవుకూర్మితోడ ॥రామ॥ 88

సీ. నిన్నటి రారాజు నేడు భిక్షుండగు
నేటిభిక్షుండు రేపు నేతయగును
నిన్నటిశిష్టుండు నేడు దుష్టుండగు
నేటిదుష్టుడు రేపనింద్యుడగును
నిన్నటిమిత్రుండు నేడు శత్రుండగు
నేటిశత్రుడు రేపునెచ్చెలియగు
నిన్నటిసౌఖ్యంబు నేడు దుఃఖంబగు
నేటిదుఃఖము రేపు నెఱి సుఖమగు

గీ. నిన్న నేటిలో భేదమేమున్నదయ్య
ఉచ్చనీచత్వగతులిట్లు నొందుటకును
తొలిని జేసినకర్మల ఫలముగాక ॥రామ॥ 89

సీ. అప్పుడేవింటి రామప్ప తప్పన్ వేరు
తండ్రియే లేడంచు దాశరథీ
అప్పుడేవింటి సీతమ్మ తప్పన్ వేరు
తల్లియే లేదంచు దనుజహరణ
అప్పుడేవింటి రామానుజన్ములు తప్ప
బంధువుల్ లేరంచు భక్తపోష
అప్పుడేవింటిని హనుమదాదులు తప్ప
మిత్రులు లేరంచు శత్రుహరణ

గీ. అప్పుడేవింటిగాని చిన్నప్పుడగుట

జ్ఞప్తిరాకుండ . చిత్తచాంచల్యమునను
నేడుమదిలోంచి నిన్ను వీడజాల ॥రామ॥ 9

సీ. మోహాశ్రమున్యుండన్న మునులమాటల నమ్మి
పాహిమాం యంచు నీపాలబడితి
సత్యమూర్తి వీయన్న జ్ఞాని మాటలనమ్మి
పాహిమాంయంచునీపాలబడితి
భక్తవత్సలుండన్న భక్తుమాటలు నమ్మి
పాహిమాం యంచు నీపాలబడితి
ఆర్తరక్షకుడన్న యార్తుమాటలునమ్మి
పాహిమాంయంచు నీపాలబడితి

గీ, పాహిమాం పాహిమాం పాహిపాహియనుచు
వాఙ్మనోకాయకర్మల వదల కెపుడు
ఆశ్రయించితి నీచరణాబ్జ ముఁను ॥రామ॥ 91

సీ. నీదివ్యనామమ్ము నిత్యమ్ము దలచుచో
చెలఁగివన్ జముఁడెట్లు చేరగలడు
నీగుణగణనమ్ము నిత్యమ్మొనర్చునన్
దండధరుండెట్లు దాకఁగలడు
నీమూర్తిపైఁజూపు నిరతమ్ము నిలుపునన్
సూర్యజుండెటు తేరి చూడగలడు
నీమహితపదయుగముఁబూజ నేయున
న్నంతకుండేమని యనగ గలడు

గీ. అదిరసీభక్తు న్గని నంతమాత్రి
వినయమున్జూపి కాలుంపు వినతులాచ
రించు నటుకానిమెడల జీవించగలడె ॥రామ॥ 92

సీ. ధనహీనుతో చెల్మి ధనవంతునకుహాని
గుణహీనుతో చెల్మిగుణికిహాని
అజ్ఞానితో చెల్మిసుజ్ఞానికిన్ హాని
ముచ్చులతో చెల్మిమునికిహాని
తాగుబోతుని చెల్మి తాపసునకుహాని
తులువతో చెల్మిభక్తునకుహాని
సంసారితో చెల్మి సన్యాసికిన్ హాని
కోపిష్ఠి చెల్మి యోగులకుహాని

గీ. జారిణితో చెల్మి సత్కులసతికిహాని
దొంగతో చెల్మిభువినేలు దొరకుహాని
నీకటాక్షంబుగల్గిన నేమిహాని ॥రామ॥ 93

సీ. నీపైన భక్తియే నిజముగాగలవారి
కడవైననేమి యిల్లైన నేమి
స్థిరమగు వైరాగ్య దీక్షబూనిన వారి
కడవైననేమి యిల్లైననేమి
సమగుణ సంపద సంప్రాప్తులగు వారి
కడవైననేమి యిల్లైననేమి

యిందిరామోహనాస్మదంబు నెరుగని వారికి
నడవైననేమి యిల్లైన నేమి

గీ. జ్ఞాని కడవైననేమి యిల్లైననేమి
మానికడవైననేమి యిల్లైననేమి
దురితదూర స్వభావుడందున్న నేమి. ॥రామ॥ 94

సీ. అధికపరిసంగంబు లాడెడువారికి
దండంబులని దారితప్పవలయు
జార పరిసంగంబు సల్పెడు వారికి
వందనంబని దారివదలవలయు
కుటిల పరిచారంబు గూర్చెడివారికి
సాష్టాంగమని వేగసాగవలయు
క్రూరకర్మోద్యోగ శూన్యులౌ వారికి
జోహారులని పోవజూడవలయు

గీ. అట్లుగాకున్న మౌనంబెయుగునుగాన
ఎట్లులైనను జన్మంబు గుట్టుగాను
జరుపుకొనుచున్న తుదనాత్మ శాంతిగలుగు. రామ॥ 95

సీ. శ్రీరామయనుమాట చెవిదూరకున్నచో
నేమాట చెవిదూరి యిచ్చుసుఖము
మాధవ యనుమాట మదికింపుగాకున్న
నేమాట మనసున కింపుగలుగు

శ్రీకృష్ణయనుమాట సిగ్గగునన్నచో
నేమాట సిగ్గుదీయించగలుగు
అచ్యుతమనుమాట యభిమానమైనచో
నేమాట యభిమాన మిగురజేయు

గీ. వనుచు చెవిదూరి మనసుకానంద మొసగి
సిగ్గువిడిపించి మానంబు బుగ్గిగలిపి
నిత్యసౌఖ్యార్థినై నిన్ను నెంచుచుంటి. రామ॥ 96

సీ. ఏమికర్మమొగాని రామనీభక్తులు
నాగరీకుల కండ్ల నలుసులైరి
ఏమికాలమొగాని రామనీనామంబు
శ్రీమంతులకును జోరీగయయ్యె
ఏమిన్యాయమొగాని రామ నీచరితముల్
కాముక హృత్కంటకంబులయ్యె
ఏమిధర్మమొగాని రామ నీగుణకీర్తి
వ్యష్టిస్వభావికి నష్టమయ్యె

గీ. ఏమికారణమోగాని రామచంద్ర
రండు శ్రీరామ భజనకు రండటంచు
పిలచు దాసులగని నవ్వ తొలగుచుంద్రు ॥ రామ॥ 97

సీ. జన్మార్జితాఘ దుస్సంఘ పరిశాంతికై
నిన్నెంచదలచిన నిద్రవచ్చు

సంసారభయముల పటాశతు్రిశాంతికై
నిన్నెంచదలచిన నిద్రవచ్చు
జన్మకారణమైన సంకల్పశాంతికై
నిన్నెంచదలచిన నిద్రవచ్చు
కులధర్మవర్జిత గుణదోష శాంతికై
నిన్నెంచదలచిన నిద్రవచ్చు

గీ. ఏమిశతు్రిత్వమోగాని రామచంద్ర
నీదు మాటెత్తినంతనె నిద్రవచ్చు
వేరుయోచించు సమయాన నిద్రరాదు ॥రామ॥ 98

సీ. మొండివాదము సేయు ముమ్కారాత్ములజూచి
మౌనంబు వహియించు జ్ఞానమిమ్మ
ప్రకృతివాదము సేయు వికృతవాదులజూచి
తెలిసిమాట్లాడెడి తెలివినిమ్మ
అచలవాదము సేయు ప్రచలితాత్ములజూచి
తొలగిపోయెడి సాధుత్రోవనిమ్మ
శూన్యవాదము సేయు సోమారులను జూచి
చాటుగాదాగెడి చోటునిమ్మ

గీ. శాంతశమదమాది గుణభూషణులునయ్యు
శుద్ధపరభక్తి భాగ్యప్రసిద్ధులైన
సాధుజనమైత్రి నాకిమ్మ సారసాక్ష ॥రామ॥ 99

సీ. సారమై యమృత కాసారమై యుపనిష
త్సారమై వేదాంత సారమగుచు
స్థానమై ముక్తి సోపానమై మధుపాన
పానమై సత్యాను పానమగుచు
జీవమై భువన సంజీవమై భక్తి గా
జీవమై సీతానుజీవమగుచు
ఆందమై సచ్చిదానందమై శివదిదా
నందమై దశరథా నందమగుచు

గీ. పరమకల్యాణ సామ్రాజ్య పదవి నిచ్చి
తిరిగిరాకుండ సేయు నీదివ్యనామ
సంస్మరణసేతు ననుబ్రోవ జాగదేల ॥రామ॥ 100

సీ. హారమై సన్మంత్ర హారమై శత్రువినం
హారమై మునిహృద్విహారమగుచు
అంతమై సకల విద్యాంతమై భయదగు
ణాంతమై సరసగుణాంతమగుచు
సత్యమైభక్తిక గత్యమై దుర్గుణా
పత్యమై కామిక పత్యమగుచు
ముక్తమై సజ్జన భుక్తమై ధ్యానోప
యుక్తమై దృష్టిక వ్యక్తమగుచు

గీ. పరమకల్యాణ వైభోగ్య భాగ్యమగుచు

అర్ధిజనకల్ప భూజమై యమలమగుచు
అక్షయంబైన నీపదమాశ్రయింతు ॥రామ॥ 101

సీ. భవరోగ హరణమై భక్తికాభరణమై
సత్సదాచరణమై శరణమగుచు
పరమార్థమంత్రమై భయహరతంత్రమై
సాధుస్వతంత్రమై సౌఖ్యమగుచు
సంసార తరణమై సజ్జనావరణమై
సందేహ హరణమై శాంతమగుచు
సంపత్సమృద్ధమై శక్తిప్రబుద్ధమై
ప్రజ్ఞాన బద్ధమై ప్రముఖ మగుచు

గీ. భక్తజనశత్రు హరణమై ముక్తినిచ్చు
మహిమగల తారకంబను మంత్రమూర్తి
నీవెయని నమ్మియుంటి ననుఁ బ్రోవుమయ్య. రామ। 102

సీ. భావమైమాయావిలాసమై భువనని
వాసమై గిరిజహృద్భావనమగుచు
మూలమై మోహనిర్మూలమై సద్గుణ
సాలమై పురుషార్థ శీలమగుచు
శాంతమై దుఃఖోప శాంతమై సకలార్థ
సంతమై కుగుణగణాంతమగుచు

నాశమై భవబంధ నాశమై దురిత వి
నాశమై యానంద కోశమగుచు

గీ. వెలయు నీనామ గుణకీర్తి వివిధగతుల
పాడుకొను చుండనిత్యంబు భక్తితోడ
నను కృతార్థునేయవదేలకరుణజూపి ॥రామ॥ 103

సీ. సకల పాపవినాశ జానకీ హృదయేశ
సద్గుణ గణభూషసాధుపోష
సంసారభయనాశ సన్మౌనిహృద్వాస
వేదవేద్యాకీర్తి విజితకాళ
దేవాదిదేవేశ దివ్యాంబరవిభూష
దీనదురితనాశ దివ్యవేష
సాకేతపురవాస శంకరచిద్వాస
అద్వైత పురవాస అసురనాశ

గీ. భువనమోహన వేషమోపుణ్యపురుష
దాసుమొరవినవేమయా ధర్మపోష
కనులబడరాదె నాకింక కనకభూష ॥రామ॥ 104

సీ. దశముఖమర్దన ధర్మరక్షకరామ
పతిత పావనకృత భవ్యనామ
భక్త చిదర్శిజన పాపనాశనరామ
మునిజననుతరామ వినుతనామ

ఏక పత్నివ్రత యినకులాంబుధిసోమ
గిరిజేశనుతనామకీర్తి కామ
సకల లోకాశ్రిత సత్పవిత్రిసురామ
భువన మోహనరామ వేద్యనామ

గీ. శ్యామకోమల దేహ శ్రీరామ రామ
సామవేద స్వరూప శ్రీరామ రామ
రమ్ము నను బ్రోవ వేగమె రామ రామ ॥రామ॥ 105

సీ. శ్రీరామ రఘురామ శ్రీజానకీరామ
నామొరాలింపవె రామచంద్ర
భువనమోహనరామ భువనరక్షకరామ
నామొరాలింపవె రామచంద్ర
కల్యాణ గుణధామ కౌస్తుభధరరామ
నామొరాలింపవె రామచంద్ర
సత్యసంధకరామ సాకేతపురధామ
నామొరాలింపవె రామచంద్ర

గీ. నామొరాలించి కరుణించి రామచంద్ర
ప్రాపునొసగి రక్షింపవే రామచంద్ర
రమ్ము నను బ్రోవ వేగమె రామచంద్ర ॥రామ॥ 106

సీ. నిత్యకల్యాణాయ నీరజనాభాయ
మనసిజ జనకాయ మంగళంబు
షడ్గుణ రహితాయ షడ్గుణ సహితాయ
మానవ రూపాయమంగళంబు
తారక నామాయ దశరథ పుత్రాయ
మహనీయ తేజాయ మంగళంబు
ఆనంద రూపాయ అఖిలలోకేశాయ
మైథిలీనాథాయ మంగళంబు
గీ. మామకాభీష్టవరదాయ మంగళంబు
మన్మనోతాపనాశాయ మంగళంబు
మామకమనోవిహారాయ మంగళంబు ॥రామ॥ 107

సీ. తప్పులు దోడిన నొప్పుగా నవరించు
భారంబు నిల్పుము భక్తులందు
భావభేదంబున్న భావించి నవరించు
భారంబు నిల్పుము భక్తులందు
పాకదోషంబున్న పరికించి నవరించు
భారంబు నిల్పుము భక్తులందు
గుణదోషములెయున్న గుఱుతించి నవరించు
భారంబు నిల్పుము భక్తులందు

గీ. తప్పులేకుండ రచియింప తగినశక్తి
లేని స్వల్పుండగాన నాలించి మొరల
తప్పులెంచకనను బ్రోవు దానరక్ష
రామ శ్రీరామ కోదండ రామచంద్ర! 108

శ్రీ హనుమత్సీతా లక్ష్మణ భరత శత్రుఘ్నసమేత
శ్రీరామ చంద్రచరణార విందార్పణమస్తు
సద్గురు చరణార విందార్పణమస్తు.



ఏలూరు శ్రీ పాండురంగ ముద్రాక్షరశాలయందు ముద్రింపబడినది.